

# భట్రాజుల కవిసమ్మేళనం




సంపాదకురాలు

చక్రహరి రమణ

M.A-Telugu,TS-SET,TPT,(Phd)



యాకుందేందు తుషార హార ధవళా యా శుభ్ర వస్త్రాన్వితా
యా వీణావరదండ మండితకరాయా శ్వేత పద్మాసనా
యా బ్రహ్మాచ్యుత శంకర ప్రభృతిభిదేవై సదా పూజితా
సామాంపాతు సరస్వతీ, భగవతీనిశ్శేష జడ్యా పహాః

Title of Book:
Bhatrajula Kavi Sammelanam
Name of the Editor:
Chakrahari Ramana



Publisher:
KV Raghavacharya Smaraka Sahithya Peetam,
Government Degree College,Siddipet(A),
Town&Dist.Siddipet.Telangana,India.
Pincode:502103
Editor's Name & Address
Chakrahari Ramana
H.No.6-4-164
Ram Nagar,Barah Imam,Siddipet,
Town&Dist.Siddipet.Telangana,India.
Pincode:502103
Cell :9247226292
Book Designer:
Chakrahari Ramana,Lecturer in MA Telugu
KV Raghavacharya Smaraka Sahithya Peetam,
Government Degree College,Siddipet(A),
Town&Dist.Siddipet.Telangana,India
Cell :9177257592

# నా మాట

ఆత్మీయ బంధువులు, పితృసమానులు, మాతృసమానులు, గురుతుల్యులు మన భట్రాజు కవి సమ్మేళనం అనే గ్రూప్ సమూహాములో గత కొన్ని రోజులుగా పెద్దలు రాసే పద్యాలను కవితలను చూస్తున్నాను చాలా సంతోషం అనిపించింది. అందుకే ఈ పద్యాలు కవితలు కేవలం వాట్సాప్ గ్రూపులోని ఉండిపోకుండా ఒక పుస్తకం మాదిరిగా వస్తే ఎలా ఉంటుంది అనే ఆలోచన కలిగింది. అందుకే ఈ ఆలోచనను అమలు పరచాలని ఆసక్తితో నా శక్తి మేరకు ఒక దగ్గరగా చేర్చాను. archive.org లో అంతర్జాల పుస్తకంగా మార్చాలని అనుకుంటున్నాను.ఇందులో రచయితలకి కవులకి ఎలాంటి ప్రమేయం లేదు. ఎందుకంటే నేను మన గ్రూప్ నుండి సేకరించిన వాటిని మాత్రమే ఒక పుస్తకం మాదిరిగా తీసుకురావాలని తపనతో ఇలా చేశాను. అందుకు పెద్దలు రచయితలు కవులు నాకు అనుమతిస్తారని అనుకుంటున్నాను. నేను ఈ పుస్తకంలో కేవలం జూన్ 2023 మాసంలోని కవితలను మాత్రమే సేకరించాను. అందుకు నన్ను ఆశీర్వదించి, అనుమతిస్తారని భావనతో మీ సోదరి

శ్రీమతి చక్ర హరి రమణ
తెలుగు శాఖ
ప్రభుత్వ డిగ్రీ కళాశాల, సిద్దిపేట

# కవిసమ్మేళనం

నెలతలు బంతిగట్టుకొని నీరెగజల్ల తదీయ మంజులాం
జలి కలితోదకం బెగయు జాడనుతింపగ నయ్యెతత్కు చాం
చల జఘునాభి ఘూతమయి .........అని భట్టు మూర్తి
అన్నట్టు, జలక్రీడాలాడినట్లు పద్యాలతో,కవితలతో
నిజంగా కళఆటలే ఆడుతున్నారు. పూర్వకాలం నుండి
ఆశ కవిత్వంతో పాటు ఎన్నో రకాల చమత్కారం
కవితలను అల్లి ఎంతో మంది మనస్సులను
మైమరిపించిన మహా మేధావులు మన భట్రాజులు.
భట్టుమూర్తి నుండి మొదలు నిన్న మొన్నటి బిరుదు
రాజు రామరాజు వరకు, భట్రాజుల గొప్పదనాన్ని చాటి
చెప్పుతూ వచ్చినవారే. వారే కాకుండా ఇప్పటికీ ఆ
కవితల సౌరభాన్ని ఆస్వాదిస్తూ అందరికీ పంచేవారు
ఉన్నారంటే అందులో ఏ మాత్రం అతిశయోక్తి లేదు. ప్రతి
రోజు భానుని వచ్చదనానికి నిద్ర లేస్తూ, ఆ సూర్య
భగవానుడిని బుజ్జగిస్తూ, మేలుకొలుపుతూ,
ఉయ్యాలలూపుతూ, తాపాన్ని,కోపాన్ని
తగ్గించమంటూ,నమస్కరిస్తూ ఇలా ఎన్నో రకాల
భావనలతో తమ తమ కవితల ద్వారా, పద్యాల ద్వారా
ఇంత అందంగా అందిస్తున్నారంటే దినచర్యలో
భాగంగా ఇంకా ఎన్నో రకాల భావనలు ఉంటాయని
అర్థమవుతుంది. మన భట్రాజు అసలు తత్వాన్ని
మరుగున పడకుండా భవిష్యత్ తరాల వారికి
అందిస్తున్న మీకు ధన్యవాదాలు తెలుపుతూ.

శ్రీమతి చక్ర హరి రమణ
M.A., TPT,TS-SET(Phd)

ఆత్మీయ బంధుమిత్రులకు
ఇందు వాసర సుప్రభాత
నమస్సుమాంజలి
************

🙏 ఓం వా స వ స్వా మి నే నమః 🙏
🙏 ప్రభాకరునికి ప్రభాత పద్య నైవేద్యం 🙏
🏵️ తేట గీత మాలిక (828) 30..6..23.🏵️

వసుధనేలియు రాజులు వాసిగాంచె
చేసి యుద్ధాలు మిక్కిలి జీవితాన
యోద్దలై కీర్తి బొందిరి యోగ్యముగను
విస్తరించియు రాజ్యాలు విరివిగాను
చరితపుటలందునిలిచిరి ధరణియందు
తిమిరముతొొచేయుచుండియు సమరమెపుడు
వెలుగు రేడుగ నిలిచేవు వేదవేద్య
రోజు కనిపించి మమ్మే లు రాజు నీవె

...............................................

చేతులారరంగ శివుని పూజింపడేని
నోరు నొవ్వంగ హరికీర్తి నుడువడేని
మానవునికర్తవ్యంతెలిపేమంచిపద్యం

సమర్పణ: నన్నపు రాజు రమేశ్వర రాజు
🏵️ గుర్తూరు / హనుమకొండ 🏵️

ఏల వచ్చేనమ్మ సూర్యుడు ఏల వచ్చును
ముచ్చటైన కిరణాలతో మేల్కొల్ప వచ్చును

ఏలవచ్చునమ్మ సూర్యుడు ఏల వచ్చును
జీవ జాతి కెళ్ల ప్రాణ శక్తినిచ్చును

ఏల వచ్చునమ్మ సూర్యుడు ఏల వచ్చును
పంచభూతాల కెళ్ల కాల నియంత్రణ ఇచ్చును

ఏల వచ్చి ఉదయ దర్శనమిచ్చును
ఆర్ఘ్యం స్వీకరించి మంచి దీవెనలు ఇచ్చును

ఓం శ్రీ నిత్యాదరణ ముచ్చట దేవా
శ్రీ మిత్ర తేజో రవీంద్ర నమో నమః 🙏 💐
బాలచందర్ ఉమా

ఆత్మీయ బంధుమిత్రులకు
ఇందు వాసర సుప్రభాత
నమస్సుమాంజలి

************

🙏 ఓం ప శు మ తే నమః 🙏
🙏 ప్రభాకరునికి ప్రభాత పద్య నైవేద్యం 🙏
🏵 తేట గీత మాలిక (827) 29..6..23 🏵

అన్న వదినల సేవకై నడవి యందు
అనుగుభార్యనువదిలియాయనుజుడపుడు
నీడ యై సాగె రాముని తోడుగాను
సొంతనిదురనుప్రియమైన సతికినొదిలి
రాత్రి బవలులు నిలిచెను రక్షకుడిగ; ;
ధర్మ మార్గము నడిచెను తమ్ముడయ్యి
రామ కథలోన ఘనుడైయ లక్ష్మణుండు
భాస్కరా! బెంచె నీ వంశ ప్రతిభనితడు

..........................................................

దండమయా విశ్వంభర, దండమయా
పుండరీక దళ నేత్ర హరీ.......
హరికి నమస్కరించుటకు ఇంతకన్నా
మంచి పద్యంకలదా....
సమర్పణ: నన్నపు రాజు రమేశ్వర రాజు
🏵 గుర్తూరు / హనుమకొండ 🏵

అంతా సూర్యమయం ఈ జగమంతా
సూర్యమయం ఉదయం మొదలై
సాయంత్రం వరకు సాగే సూర్యమయం

అంతరంతరాలమున సాగే నిండు
సూర్యమయం
సురలు అసురల గగన తారల సూర్యమయం

అండ పిండ బ్రహ్మాండములో సూర్యమయం
బ్రహ్మలోక కైలాస వైకుంఠ సూర్యమయం

ప్రత్యక్ష దర్శన సమయమంతా సూర్యమయం
ప్రార్ధనల అందుకొన చేరునంతా సూర్యమయం

ఓం శ్రీ విశ్వ జగత్ సూర్యమయ దేవా
శ్రీ బానోదయ తేజ భాస్కర నమోన్నమః 🙏
💐
బాలచందర్ ఉమా

ఆత్మీయ బంధుమిత్రులకు
ఇందు వాసర సుప్రభాత
నమస్సుమాంజలి
***********

🙏 ఓం వా స వ ప్రి యా య నమః 🙏
🙏 ప్రభాకరునికి ప్రభాత పద్య నైవేద్యం 🙏
🏵 తేట గీత మాలిక (826) 28..6..23 🏵

వేద కాలాన విజ్ఞాన విరులు విరిసె
మధ్యకాలాల సంస్కృతి మసకబారె
ఆధునిక కాలమందున నంత మారె
కాలమేరీతి మారినా కమల మిత్ర
సూరసూరార్యుడా నీవు మారలేదు
నాడు నేడైన రేపైన రేడు నీవె
ప్రాణి కోటికి తోడుగా భాను తేజ
నిలువుమాయెల్లకాలము నిర్ధరాయ
.............................................

భండనభీముడార్తజనబాంధవుడుజ్వల
రామునిప్రతాపాన్నితెలిపే ప్రశస్తపద్యం

సమర్పణ: నన్నపు రాజు రమేశ్వర రాజు
🏵 గుర్తూరు / హనుమకొండ 🏵

తొలి పొద్దు వేడుక చూడాలో రన్నో
చిన్నన్న
మన కష్టమంతా తీరునురో రన్నో చిన్నన్న

పక్షుల గుంపుల విహారం రన్నో చిన్నాన్న
వనాల నిండా పచ్చదనం రన్నో చిన్నన్న

కొండ కోనల పరువాలు రన్నో చిన్నన్న
సముద్రతీర అందాలు రన్నో చిన్నన్న

ప్రాతఃకాల దర్శనాలు రన్నో చిన్నన్న
ప్రార్థన స్వీకరణ దీవెనలు రన్నో చిన్నన్న

ఓం శ్రీ ఉషోదయ అందాల వేడుక దేవా
శ్రీ ఆదిత్య తేజో నమో నమః 🙏 🌷

బాలచందర్ ఉమా

ఆకాశ అందాల సుందరా కరుణాకరా
అరుణోదయ వెలుగుల తేజోద్దారా

సింధూర ఎరుపు వర్ణాలతో నిలిచేవురా
పట్టు బిగిస్తూ అలా అలా కఠినమేలరా

పయన దారిలో ప్రాణాలను నిలిపివురా
విశ్వాన విశ్వదాత గా కొనసాగేవురా

ప్రత్యక్ష దర్శన భాగ్యం ఇచ్చేవురా
మా ప్రార్ధనల గైకొని ఆదరించేవురా

ఓం శ్రీ విశ్వ ప్రాణదాతా ప్రభో
శ్రీ సూర్య తేజో సూర్య ప్రభాకర నమో
నమః 🙏 💡
బాలచందర్ ఉమా

ఆత్మీయ బంధుమిత్రులకు 🙏
భౌమ వాసర సుప్రభాత🙏 🙏
నమస్సుమాంజలి🙏 🙏 🙏 🙏

**********

🙏 ఓం వ సు మ తే నమః 🙏
🙏 ప్రభాకరునికి ప్రభాత పద్య నైవేద్యం 🙏
🏵 తేట గీత మాలిక (825) 27..6..23 🏵

ధ్వంసమొనరించయాగము
దనుజులపుడు

రాజరుషిగోరె దశరధు, రాము బంప
రామలక్ష్మణు లిరువురు రయముగాను
సావధానులై మునివెంట సాగి నారు
నిలిచి రక్షించి యాగము నిష్ఠ తోడ
తరిమివేసియుమారీచు ధైర్యముగను
అల సుబాహువుజంపియు బలముజూపి
బాల్యమందునశూరులై బడసియశము
పెంచె నీవంశ కీర్తిని బేర్మి తోడ

..................................................

అల్పుడెపుడు పల్కునాడంబరముగాను
సజ్జనుండు పల్కు చల్లగాను...
అల్పాక్షరాలలోఅనంతార్ధంగల పద్యం
సమర్పణ:నన్నపు రాజు రమేశ్వర రాజు
🏵 గుర్తూరు / హనుమకొండ 🏵

ఆత్మీయ బంధుమిత్రులకు
ఇందు వాసర సుప్రభాత
నమస్సుమాంజలి
***********

ఓం వి భ వే నమః
ప్రభాకరునికి ప్రభాత పద్య నైవేద్యం
తేట గీత మాలిక (824) 26..6..23

అద్భుతంబైనవిషయమా యాకసంబు
వింతలెన్నియో గలవట వేదవేద్య
సప్తరుషిమండలంబు నా సదనమందు
వెలసియున్నదటంచును వింటిమయ్య
వారి దర్శన మెప్పుడు వంద నీయ
జరుగుచుండుననీకయ్య అరుణదేవ
జపము,తపములుచేయని జనులుమేము
నిన్ను చూచిన చాలును నింగిరాయ
పూర్ణఫలములు కలుగును పూష్ణదేవ

.......................................................

నను భవదీయదాసుని మనంబున
నెయ్యపుకిన్కపూని తాచిన అది..
సత్యపట్లకృష్ణుడుచూపిన ప్రేమకు..
పరాకాష్ట ఈ సరస పద్య రాజము
సమర్పణ: నన్నపు రాజు రమేశ్వర రాజు
 గుర్తూరు / హనుమకొండ 





ఇరువెళ్లి పోతున్నాయి రా

ఓ మానవులారా

మేల్కొని వెలుగు కిరణాల దరి చేరరా

దేవుడే ఆ ఆదిత్య నాథుడు ఉన్నాడు రా

తన ఎదుట నిలువ దారి వెతకరా

తల్లిదండ్రి అతడే స్నేహితుడు అతడే ను రా

అనునిత్యం జీవపుష్టి శక్తినిచ్చేనురా

దర్శనమిచ్చే సమయమాయేనురా

ప్రార్థనలు అందించి దీవెనలు కోరెదము రా

ఓం శ్రీ సంద్రాల ప్రయాణ మార్గదర్శి దేవా

శ్రీ ప్రభాకర తేజో మిత్ర నమో నమః 🙏



బాలచందర్ ఉమా

ఇరులెల్లి ---చీకట్లు







ఆత్మీయ బంధు మిత్రులకు🙏
భాను వాసర సుప్రభాత🙏 🙏
నమస్సుమాంజలి🙏 🙏 🙏 🙏
************
🙏 ఓం పు ష్క లా య నమః 🙏
🙏 ప్రభాకరునికి ప్రభాత పద్య నైవేద్యం 🙏
🏵 తేట గీత మాలిక (823) 25..6..23 🏵

సంతుగోరి దిలీపుండు సతినిగూడి
గురునియానతి నందిని గోవుసేవ
చేయుసమయానకబళించ సింహమొకటి
తననురక్షింప మనికోర, ధైర్యముగను

ధేనువునురక్షచేసెను ధీయుతుండు
మాటనిల్పి, వశిష్ఠుని మాన్యు డాయె
నీదువంశపు కీర్తియు నిలిపెనితడు
ఎందరో గల రీరీతి ఇజ్య దేవ

.................................................

జలజాతాసనవాసవాది సుర పూజా
భాజనంబై తనర్చు లతాంతాయుధు
కృష్ణునితలనుసత్యవామపాదం తో
తన్నినవిషయంతెలిపేసుందరపద్యం
సమర్పణ:నన్నపు రాజు రమేశ్వర రాజు
🏵 గుర్తూరు / హనుమకొండ 🏵

చూసే వారికి  ఎరుక సూర్యోదయ వేడుక
చూడని వారికి ఏమెరుక ఉషోదయ చేరిక
చెట్ల పైన పిట్టలకు ఎరుక తొలి కిరణా చురక
ఎక్కడో పరుండేవారికి ఏమి ఎరుక ఆ
వెలుగులిక
ఆరు బయట కూసుండే వారికి ఎరుక తొలి
కాంతి కలిక
ముసుగుదన్ని మూలకుండే వారికి ఏమెరుక
ఆ ఆస్వాదాల ఫలక
తొలిదర్శనం ఆనందాలన్నీ చూసేవారికి ఎరుక
నిత్యం ప్రార్ధనలు అందించే వారి కెరక
నిజమైన కానుక

ఓం శ్రీ నిత్యానందాల తొలి ఏరుక దేవా
శ్రీ ఆదిత్య తేజో సూర్య నమో నమః 🙏
💐
బాలచందర్ ఉమా

# యెద బాద

ఏ ఆంతరంగమున మనసు వికసించి
వెకటించేనో!

ఆ లోలోతు గాయాల మాన్పుకి యెంత
వికటించేనో!

ఆ లోలోతుమాన్పునెరగని కన్నీరు
యెంత భరించనో!

కనుల కలలు అల్లన చెదిరిన మనసు
యెంత నోచెనో!

భల్లున కాలంతరంగికము గనిన కలలు
మరలి తిప్పించ్చినో! తిప్పల యెడ
సుఖ సౌకర్యము నెరగని యెద
లోతుల నొప్పికి!

ప్రవిరారా

విజయ రామ రాజు

పండితుని జేర జడుడంత ప్రాజ్ఞుడౌను
మల్లె జేరిన కురులంత మరులు గొల్పు
చప్ప నైనట్టి బీరను సరిగ కోసి
వండ నుల్లి మసాలతో వరలు రుచియె.

సన్నగ గరగర పొడవుగ
తిన్నగ నాజూకు నుండు తీరున బీరన్
యెన్నగ కూరయు పచ్చడి
మన్నన గుణమున పథ్యము  మంచినిచేయున్.

అమ్మ అత్త కొడుకు ఆలి కూతురు భర్త
అమ్మవదినె కొడుకు అయ్య ఆలి
ఎవరికెవరు ఏమి, ఎవ్వారు యెవ్వరో
బీరకాయ పీచు బెండ జిగురు.

** శిష్లా తమ్మిరాజు **

సందడి లేక చప్పుడు చేయక వచ్చే వేళ
కనులపై వాలి కాంతులు చిందే వేళ
చిరుగాలుల సవ్వడిలో విహరించే వేళ
గలగల సవ్వడుల నదుల పరుగుల వేళ
ప్రకృతి ఒడిలో సేదతీరు కోరికల వేళ
పరవశించి పరిమళాలు వెదజల్లే వేళ
ప్రత్యక్ష దర్శన సమయ నయనానందాల
వేళ ప్రార్ధనలు అందించి దీవెనలు
కోరే వేళ

ఓం శ్రీ ప్రశాంత పరిమళ ప్రసాద దేవా
శ్రీ భాస్కర తేజో ప్రకాశ నమోన్నమః



బాలచందర్ ఉమా







ఆత్మీయ బంధుమిత్రులకు🙏
స్థిర వాసర సుప్రభాత🙏
నమస్సుమాంజలి🙏

**********

🙏 ఓం ని ష్క లా య నమః 🙏
🙏 ప్రభాకరునికి ప్రభాత పద్య నైవేద్యం 🙏
🏵 తేట గీత మాలిక (822) 24..6..24.🏵

చలినియోర్వగలేరయ్య చారుహృదయ
వర్షములునెక్కువైనను భయముగలుగు
ఎండవడలకు పగలంత గుండెలదురు
కాలమేదైన మనుషులు కష్టమనును
పంచభూతాలచెడగొట్టు పనులుచేయు
స్వార్థచింతనచేయుచు సాగుచుండు
ఈతి బాధల తగ్గించు ఇన మహాత్మ
తట్టుకొనుశక్తి నివ్వుమా! దండి దేవ

...............................................

ఒరులే యవియొనరించిన
నరవరయప్రియముదనమనంబునకగు..
మానవులు పాటించవలసిన ధర్మాన్ని
తెలిపేభారతంలోనిచిరుపద్యరాజము
సమర్పణ: నన్నపురాజు రమేశ్వర రాజు
🏵 గుర్తూరు / హనుమకొండ 🏵

ఆత్మీయ బంధుమిత్రులకు 🙏
భృగువాసర సుప్రభాత🙏 🙏
నమస్సుమాంజలి🙏 🙏
*************

🙏 ఓం స్థి తి ప్రి యా య నమః 🙏
🙏 ప్రభాకరునికి ప్రభాత పద్య నైవేద్యం 🙏
🏵 తేట గీత మాలిక (821) 23..6..23 🏵

దేవదానవ యుద్ధాన ధీర వనిత
కైక కిచ్చిన మాటకు కట్టుబడియు
కొడుకు నెడబాయ లేకనుకుప్పగూలి
నేలవాలియు దుఃఖించె జాలిగొలుప

మనసునలిగినా మాటనుమార్చలేదు
ప్రాణ త్యాగము చేసిన మాన ధనుడు
నీదు వంశపు కీర్తిని నిలిపినాడు
రామునికితగ్గ తండ్రియే స్వామితాను
..............................................
శ్రీకృష్ణా యదుభూషణ నరసఖా
శృంగారరత్నాకరాలోకద్రోహివంశదహనా
కృష్ణ స్తుతిలోఆణిముత్యంలాంటిపద్యం
సమర్పణ:నన్నపు రాజు రమేశ్వర రాజు
🏵 గుర్తూరు / హనుమకొండ 🏵

ఆత్మీయ బంధుమిత్రులకు🙏
బృహస్పతివాసర సుప్రభాత🙏 🙏
నమస్సుమాంజలి🙏 🙏
*************
🙏 ఓం స్తి తి స్థే యా య నమః 🙏
🙏 ప్రభాకరునికి ప్రభాత పద్య నైవేద్యం 🙏
🏵 తేటగీత మాలిక (820) 22..6..23 🏵

వచ్చె రుతుపవనమ్ములువచ్చెననియు
వార్త లేకాని తొలకరి వాన లేదు
వేడిగాడ్పులు తగ్గిన జాడ లేదు
నోళ్లు చాచుక యున్నవి బీళ్లునిచట
చాళ్లు దున్నగ రైతులు సాగలేక
ఆకసంబును జూచిరి నార్తి తోడ
ఝల్లులనువేగపంపుమా జాలిచూపి
ఎల్లరనుగాచుదైవమా! ఇనమహాత్మ
...............................................
మందారమకరందమాధుర్యమునదేలు
మధుపంబు వోవునే మదనములకు...
భక్తుల లక్షణాన్ని తెలిపే పద్య రాజం
సమర్పణ:నన్నపు రాజు రమేశ్వర రాజు
 గుర్తూరు / హనుమకొండ 

గగనసీమ నంత ఘనము గా ఏలుతూ
ఉదయమున శాంతముగా చేరుతూ
గడియ గడిచిన కొలది భయము గొలుపుతూ
రోహిణ్లో రోకళ్ళు పగిలించి మృగశిరలో వేగుతూ
బయటకు రావాలన్న భయంకరమని పించుతూ
ఏలనయ్యా పరిస్థితి మార్చు మేఘాలు పంపుతూ
నిత్యదర్శనములో నైనా ఆహ్లాదము చూపుతూ
ప్రార్థనలు స్వీకరించు సంతోషము తెలుపుతూ

ఓం శ్రీ వేసవి ఎండల గ్రీష్మ తాపదేవా
శ్రీ సూర్య భాను తేజా నమో నమః 🙏 🌷

బాలచందర్ ఉమా

ఆత్మీయ బంధుమిత్రులకు 🙏
సౌమ్యవాసర సుప్రభాత🙏 🙏
నమస్సుమాంజలి🙏 🙏

***********

🙏 ఓం సర్వోదధి స్థితికరాయ నమః 🙏
🙏 ప్రభాకరునికి ప్రభాత పద్య నైవేద్యం 🙏
🏵 తేటగీత మాలిక (819) 21..6..23 🏵

అలజగన్నాథు బలరాము డనుజతోడ
కలిసి వెలసిరి పూరీన ఘనముగాను
వత్సరమ్మునకొకసారి యుత్సవంబు
మూడురథములలాగుచు ముచ్చటగను
లక్షలాదిగ జనులెల్ల లక్షణముగ
జరుపుచుందురు వీధులసాగుచుండి;
నేల యీనినదన్నట్లు నింగి రాయ
రెండు కళ్లైన చాలవు దండి దేవ
మానవులకిల మార్తాండ మహిమజూడ
చూచియాశీర్వదించుమా సూర్య దేవ

...............................................

ఉప్పుకప్పురంబునొక్కపోలికనుండు
...పురుషులందు పుణ్యపురుషులు...
పద్యంచిన్నదైనా.లోకసత్యంతెలిపింది
సమర్పణ:నన్నపు రాజు రమేశ్వర రాజు
🏵 గుర్తూరు / హనుమకొండ 🏵

ప్రణమిల్లు ప్రణమిల్లు ఆదిత్య దేవుడికి

ప్రణమిల్లు ప్రణమిల్లు మేలుకొలుపు నాథుడికి

ప్రణమిల్లు ప్రణమిల్లు l

నిత్య నూతన స్నేహితుడికి ప్రణమిల్లు ప్రణమిల్లు హరిత ప్రాణ ప్రసాదకుడికి

ప్రణమిల్లు ప్రణమిల్లు పంచభూత రక్షకుడికి

ప్రణమిల్లు ప్రణమిల్లు సమస్త జీవ పోషకుడికి

ప్రణమిల్లు ప్రణమిల్లు ప్రత్యక్ష దర్శన దార్శనికునికి

ప్రణమిల్లు ప్రణమిల్లు ప్రార్థన స్వీకార కరుణాకరుడికి

ఓం శ్రీ పరిపూర్ణ ప్రాణ రక్షక విభో

శ్రీ సమిత్ర తేజోపుష్ణ నమో నమః 🙏 💐

బాలచందర్ ఉమా

ఏ సూర్య భగవానుడా ఏమని వర్ణించను
ఏ ఆదిత్యనాథుడా నిత్యం నీదేనని వర్ణించను
మేల్కొనే కనులకు తొలి కిరణం నీదని చెప్పను
జీవసత్వం ఇవ్వ వెంట నాడిచే నడిచే దైవము అని చెప్పను
కీర్తనలు మంత్రాలు స్తోత్రాలు కోరరని తెలుపను
అలంకరణల అభిషేకాల స్తోత్రాల అవసరం లేదని తెలుపను
ఎప్పుడెప్పుడు అని ఎదురు చూడని దర్శనమిచ్చునని కీర్తించను
ఆర్ఘ్యం మాత్రమే చాలు ఆశీస్సులు ఇచ్చేనని కీర్తించను

ఓం శ్రీ గగన నివాసంబైన ఘనకీర్తి దేవా
శ్రీ భానుతేజో మిహిర నమో నమః 🙏 💐

బాలచందర్ ఉమా

ఆత్మీయ బంధు మిత్రులకు🙏
భౌమ వాసర సుప్రభాత🙏 🙏
నమస్సుమాంజలి🙏 🙏
**************
🙏 ఓం ప రా త్ప రా య నమః 🙏
🙏 ప్రభాకరునికిప్రభాత పద్యనైవేద్యం 🙏
🏵 తేట గీత మాలిక (818 ) 20..6..23 🏵

చంద్రకళలను వర్ణించె సకలకవులు
కావ్యములయందువిడువక ఘనముగాను
నిండు చంద్రుని బింబమున్ దండిగాను
పండు వెన్నెలన్ బొగిడిరి భాసురముగ

ఎట్లు వచ్చెను చంద్రయ్య కింతకీర్తి
నీదు రశ్మియు సోకియు నిర్జరాయ
వెన్నెలన్ వెదజల్లుచు వెలుగు తాను
అన్నిటిక మూలమీవె గా అర్క దేవ

.............................................
కలయో వైష్ణవ మాయయో ఇతర
సంకల్పార్థమో సత్యమో తలపన్..
యశోదమ్మ ఆశ్చర్యాన్ని తెలిపే
అందమైన అపురూపమైన పద్యం
సమర్పణ: నన్నపు రాజు రమేశ్వర రాజు
🏵 గుర్తూరు / హనుమకొండ 🏵

# 🙏 💡 బాపు @ నాయిన 💡 🙏

అమ్మ జన్మనిస్తే
"బాపు" జీవితాన్నిస్తాడు...
అమ్మ భూమి అయితే...
"బాపు" ఆకాశం...
అమ్మ ఆత్మీయతను పంచితే "బాపు" అనురాగాన్ని పంచుతాడు...
అమ్మ క్షేమాన్ని కోరితే
"బాపు" ఉన్నతికై శ్రమిస్తాడు
తల్లి గర్భంలో భీజావాపనం జరిగినదాదిగా...
జీవితం లో నడక నడత కై అహర్నిశలు శ్రమిస్తాడు...
తను ముళ్ల బాటలో నడుస్తున్నా కానీ...
మనకు పట్టు పరుపులు పరచాలని తపిస్తాడు...
తన వర్తమానాన్ని ఫణంగా పెట్టి మన భవిష్యత్తుకై.. బాటలు వేస్తాడు...
మన అవసరాలకై
తన అవసరాలన్నింటినీ త్యాగం చేసి ...
తన్మయత్వం చెందుతాడు...
మన బాధను తన బాధగా... మన సంతోషాన్ని తన సంతోషంగా...
మన ఉన్నతి తన ఉన్నతిగా... మన ఉనికి తన ఉనికిగా...
మనమే తానుగా...
తానే మనంగా...
పరకాయ ప్రవేశం చేసి ..



తన ఉనికిని కోల్పోతాడు...
అహర్నిశలు శ్రమిస్తూ ...
జీవితాద్యంతము
కష్టాల కడగళ్ళు...
కన్నీళ్ళ సుడిగుళ్ళతో...
మమేకమౌతూ
బాధే సౌఖ్యమనే భావనరానివోయ్
అనే వేదాంతాన్ని ఆపాదించుకొని....
నిత్యసంతోషిలా నటించే త్యాగమూర్తి
"బాపు @ నాన్న @ నాయన @ అయ్య @ అబ్బా"
ఆయన ప్రాతస్మరణీయుడు...
మన శరీరంలోనూ జీవితంలోనూ అనువణువు వ్యాపించిన దేవుడు....
ఆయనకు అనుక్షణ ప్రణామాలు....
"ఆయనను
ఒక్కరోజులో బంధించి
"తండ్రి దినం" జరుపుతున్నానని చెప్పలేను"
ఈ జీవితంలో అనుక్షణం ఆయనదే....
అనుక్షణం ఆయన స్మరణే...
"బాపూ...."
సర్వకాల సర్వావస్థలలో...
నీవు నాకు దేవునివే ...
ప్రత్యక్ష దైవానివే...



*దేవరాజు విష్ణు వర్ధన రాజు *

ఆత్మీయ బంధుమిత్రులకు 🙏
ఇందువాసర సుప్రభాత🙏 🙏
నమస్సుమాంజలి🙏 🙏

*************

🙏 ఓం స ప్త స ప్త యే నమః 🙏
🙏 ప్రభాకరునికి ప్రభాత పద్య నైవేద్యం 🙏
🏵 తేట గీత మాలిక (817) 19..6..23 🏵

ఆశ్రమంబున బుట్టియు నవనిజకును
పరగ వాల్మీకి శిష్యులై పెరిగినారు
లవుడుకుశుడను నామాలలక్షణముగ
నేర్చి రామాయణ కథను నేర్పుగాను

పాడి వినిపించిరినయోధ్య ప్రజలకంత
రాజ దర్బారు నందునరామునకును
నీదు వంశజ తనయుల నిర్జరాయ
చూచియానందపడితివా సూర్యదేవ

.........................................

అమ్మా! మన్నుతినంగ నేశిశువునో,
ఆ కొంటినో, వెర్రినో నమ్మంజూడకు..
చిన్నికృష్ణయ్యఅమ్మకుఅమాయకంగా
చెప్పిన అందమైన పద్య రాజము
సమర్పణ: నన్నపు రాజు రమేశ్వర రాజు
🏵 గుర్తూరు / హనుమకొండ 🏵

తెల్ల తెల్లవారే తీరు
లేత కిరణాల జోరు
చీకటులు వెళ్లే తీరు
అందాల నిండే జోరు
అడవులలో చేరే తీరు
విరులు వికసించే జోరు సముద్రతీరాల వెలుగు తీరు జనాలు చేరే జోరు
పవనాలు వీచే తీరు
పక్షులు విహారించే జోరు
జీవులు పరిగెత్తే తీరు
పనులు మొదలయ్యే జోరు

రోజు సమయానికి వచ్చే తీరు ప్రత్యక్ష దర్శనం జోరు
ప్రార్థనలు అందించే తీరు దీవెనలు అందించు జోరు

ఓం శ్రీ సంతోషాల వికాస దేవా శ్రీ భాను తేజో భాస్కర నమో నమః 🙏 🙏
బాలచందర్ ఉమా

సింధూర వర్ణమున అంద చందములు
గాంచుటకై ఇష్టపడు ఎందరో మహానుభావులు

వెలుగుల తేజస్సుల కిరణములు
వచ్చునప్పుడు ఇష్టపడు ఎందరో
మహానుభావులు

బాలభానుడు చేరు సకల లోకములు
ఏ లోకం బైన ఇష్టపడు ఎందరో మహానుభావులు

ప్రత్యక్ష దర్శనం వీక్షించు నయనములు
అందించు అర్ఘ్యం ఎందరో మహానుభావులు

ఓం శ్రీ మహానుభావుల హృదయానంద దేవా
శ్రీ భాస్కర తేజో ఆదిత్య నమో నమః 🙏 💐

బాలచందర్ ఉమా

ఆత్మీయ బంధుమిత్రులకు 🙏
భానువాసర సుప్రభాత🙏 🙏
నమస్సుమాంజలి🙏 🙏

************

🙏 ఓం ఏ కా కి నే నమః 🙏
🙏 ప్రభాకరునికి ప్రభాత పద్య నైవేద్యం 🙏
🏵 తేటగీత మాలిక (816 ) 18..6..23 🏵

పుష్పయాగాలు చేతురు పుష్కలముగ
పత్రి పూజలు చేతురు బహు విధాల
కుంకుమార్చనలకు నిల కొదువలేదు
చేతురభిషేకములు చాల చిత్రముగను
పూలమాలలు వేతురు చాల చాల
వివిధ దైవాలకిలలోన విరివిగాను;;
ప్రకృతియందలి పుష్పాలు ప్రభువునికె
పత్ర హరితంపు ప్రాభవ పతివి నీవె
ఏమి ఇవ్వంగ గలవాడ ఇన మహాత్మ

.............................................

కుప్పించి యెగసిన కుండ లంబుల
కాంతి గగన భాగంబెల్ల కప్పి కొనగ
భీష్మునికనులకుకనిపించినకృష్ణయ్యను
వర్ణించిన అందమైన పద్య రాజము
సమర్పణ:నన్నపు రాజు రమేశ్వర రాజు
🏵 గుర్తూరు / హనుమకొండ 🏵

బింబ మోము గలవాని మనోహరుని
విశ్వలోకాలపై పయనించు వెలుగు రూపుని

నిర్మలాకారుని జ్వాల సృష్టి కారకుని
తూర్పు పడమరల ప్రయాణికుడిని

యుగయుగాల సాక్షి ప్రయోనిదిని
ఏ యుగం బైనా మార్పులేని చిరంజీవిని

నిత్య దర్శనమివ్వవచ్చు దివ్య జ్యోతిని
ప్రార్ధనలందుకు దీవించు ప్రేమికుడిని

ఓం శ్రీ యుగయుగాల శక్తి ప్రదాత దేవా
శ్రీ ఖగాయ పుష్ణ తేజా నమో నమః 🙏 💐

బాలచందర్ ఉమా

ఆత్మీయ బంధు మిత్రులకు🙏
స్థిర వాసర సుప్రభాత🙏 🙏
నమస్సుమాంజలి🙏 🙏
***********
🙏 ఓం వి చి త్ర ర థా య నమః 🙏
🙏 ప్రభాకరునికి ప్రభాత పద్య నైవేద్యం 🙏
🏵 తేట గీత మాలిక (815) 17..6..23 🏵

పెండ్లి యైనది నాదిగా బేర్మి తోడ
పదియు రెండేళ్లు సీతతో పరవశముగ
రామచంద్రుడు గడిపెను రమ్యముగను
అంతలో కైక బట్టించె నడవి బాట

కష్టముల పైన కష్టాల కడలి సాగి
సతినిగోల్పోయిదు:ఖించి; సమరమందు
రావణునిజంపి వెనుదిర్గి రాజ్యమేలె
అయ్య కష్టాలు విన్నచో నార్ద్ర మగును
హృదయమంతయుబాధతో సదయమాకు

..........................................

జననిసంస్కృతంబుసకలభాషలకును
దేశభాషలందు తెలుగు లెస్స
సంస్కృత,తెలుగుభాషలప్రాధాన్యాన్ని
తెలియజేసే చిన్న పద్యం
సమర్పణ:నన్నపు రాజు రమేశ్వర రాజు
🏵 గుర్తూరు / హనుమకొండ 🏵

ఆత్మీయ బంధు మిత్రులకు 🙏
భృగు వాసర సుప్రభాత🙏 🙏
నమస్సుమాంజలి🙏 🙏
*************

🙏 ఓం వి వి ధా శ నాయ నమః 🙏
🙏 ప్రభాకరునికి ప్రభాత పద్య నైవేద్యం 🙏
🏵 తేట గీత మాలిక (814) 16..6.. 23 🏵

నిత్య కళ్యాణము జరుగు నిండుగాను
వేంకటేశ్వర స్వామికి వేద విధిని
తిరుమలనురోజు పండుగేదివ్యముగను
షోడషోపచారాలను శోభ గూర్చ
భక్తజనులంత యానందపడుచుజూడ;
కాని, కర్తవ్యమే నీకు , కమల మిత్ర
నిత్య కృత్యమై నిలుచును నిర్ణరాయ
లోక కళ్యాణమందున లోకనాథ
తృప్తి దొరుకును నీకయ్య దేవ దేవ

..................................................

త్రిజగన్మోహన నీలకాంతితనువుద్దీపింప
ప్రాభాతనీరజబంధు ప్రభమైనచేలము..
భీష్మస్తుతిపద్యంలో కృష్ణస్వరూపవర్ణన
సమర్పణ:నన్నపు రాజు రమేశ్వర రాజు
🏵 గుర్తూరు / హనుమకొండ 🏵

అలా వచ్చే మొదలే వచ్చే పది దిక్కుల వెలుగు నిచ్చే
కాంతి కిరణం బై వచ్చే ఎదిలించి మేల్కొనిచ్చే
ఆకాశమంత వర్ణాలై వచ్చే నీలి సింధూరాల నిచ్చే
ఆది గమనం బై వచ్చే అపారమైన శక్తినిచ్చే
చీకటిలో చీల్చుకొని వచ్చే
తెల్ల తెల్లవారా నిచ్చే
అన్ని లోకాల చుట్టి వచ్చే
నేనున్నానని అభయం నిచ్చే
ప్రాతః కాల బంధువై వచ్చే నిండారా దర్శనం నిచ్చే
ప్రేమతో తానే వచ్చే
ప్రార్థన లుఅందుకుని దీవెనలు నిచ్చే
ఓం శ్రీ చీకటి కోటల చీల్చే వెలుగుల దేవా శ్రీ కరుణాకరతేజోమేరా నమో నమః 🙏 💐

బాలచందర్ ఉమా

ఆత్మీయ బంధు మిత్రులకు🙏
బృహస్పతి వాసర సుప్రభాత🙏 🙏
నమస్సుమాంజలి🙏 🙏
***********
🙏 ఓం వి నిం ద్యా య నమః 🙏
🙏 ప్రభాకరునికి ప్రభాత పద్య నైవేద్యం 🙏
🏵 తేట గీత మాలిక (813) 15..6..23 🏵

అమరనాథుడు వెలసెనుహిమనగాన
అద్భుతంబుగ లింగమై యవతరించె
మంచుతోడను; జనులుసేవించతనను,
కొంతకాలమే భక్తుల కోర్కె తీర్చ
అంతలో నీదు వేడికి సుంత కరుగు
కాస్త కిరణాల వాడిని, కనికరించి,
తగ్గగా జేయుమాదేవ దయను చూపి
పగ్గములతోడ నశ్వాల పరుగునాపి
..........................................

అల్పుడెపుడుపలుకునాడంబరముగాను
వేమన పద్యాలు సరళ సుందరాలు
నిత్య సత్యాల నిలయాలు
సమర్పణ:నన్నపు రాజు రమేశ్వర రాజు
🏵 గుర్తూరు / హనుమకొండ 🏵

ఆత్మీయ బంధుమిత్రులకు 🙏
సౌమ్యవాసర సుప్రభాత🙏 🙏
నమస్సుమాంజలి🙏 🙏

***********

🙏 ఓం అ చిం త్యా య నమః 🙏
🙏 ప్రభాకరునికి ప్రభాత పద్య నైవేద్యం 🙏
🏵 తేట గీత మాలిక (812) 14..6..23 🏵

మాయ మాటలు చెప్పియు మంధరమ్మ
కైక మనసున నింపెను కల్మషంబు
రాణిహృదయముమార్చియు రాయిగాను
రాజ గృహమున యగ్నిని రగుల జేయ
గొప్ప రాజైన దశరధు కుప్ప గూలె
ఆసనంబెక్కు రాముడు నడవిజేరె;;
నాడుమంధరయొక్కతే నళినమిత్ర
నేడు గలరయ్య పెక్కురు కీడు జేయ
అట్టి వారిని యణచియు అర్కదేవ
సాధుజనులను కాపాడు ఆదిదేవ

..............................................

ధరసింహాసనమై నభంబు గొడుగై
తద్దేవతల్ భృత్యులై,సిరి భార్యా...
నారాయణుని కుటుంబ వర్ణన
సమర్పణ:నన్నపు రాజు రమేశ్వర రాజు
🏵 గుర్తూరు ,/ హనుమకొండ 🏵

ఉదయపు తొలి అడుగుల దేవా సింధూర వర్ణ సూర్య దేవా
అద్భుత సృష్టిలోన మా కొరకు వెలిసిన సూర్య దేవా

తమరి గమనం తీరే నియమము కాలము సూర్య దేవా
ఘడియల గణనే అమలు విశ్వమంతా సూర్య దేవా

తమరు లేకుండా అంటే చీకటిలో మునక శ్రీ సూర్య దేవా
తమరి రాకతోనే మా నడక శ్రీ సూర్య దేవా

ప్రాతఃకాల దర్శనం పవిత్రం శ్రీ సూర్య దేవా
భక్తులు ఇచ్చే అర్ఘ్యం తో ఆనందం శ్రీ సూర్య దేవా

ఓం శ్రీ విశ్వసమయ ప్రసాద కాదేవ
శ్రీ రవి తేజో భాస్కర నమో నమః 🙏 💡

బాలచందర్ ఉమా

ఆత్మీయ బంధు మిత్రులకు 🙏
భౌమ వాసర సుప్రభాత🙏 🙏
నమస్సుమాంజలి🙏 🙏
**********
🙏 ఓం చతుర్వేద ధరాయ నమః 🙏
🙏 ప్రభాకరునికి ప్రభాత పద్య నైవేద్యం 🙏
🏵 తేట గీత మాలిక (811) 13..6..23 🏵

నీ కుటుంబపు సభ్యులు నింగిరాయ
అందరునుమాకునాత్మీయ బంధువులుగ
భావనంబును చేతుము భక్తి మీర
గ్రహములైన మాపైయనుగ్రహముచాల
చూపునట్టుల జూడుమా సూర్యదేవ
వక్ర దృష్టియె లేకుండ సక్ర మముగ
రాశిచక్రాల నడుపగా రమ్యముగను
పెద్దగా నిన్ను గోరేము ప్రేమ తోడ
అస్తు యనవయ్యనారాధ్యననవరతము
..................................................
అమ్మలగన్నయమ్మముగురమ్మల
మూలపుటమ్మ చాల పెద్దమ్మ....
ఈపద్యంరాని తెలుగువారు లేరేమో
సమర్పణ:నన్నపు రాజు రమేశ్వర రాజు
🏵 గుర్తూరు / హనుమకొండ 🏵

ఆత్మీయ బంధుమిత్రులకు 🙏
ఇందువాసర సుప్రభాత🙏 🙏
నమస్సుమాంజలి🙏 🙏

************

🙏 ఓం మ హే శ్వ రా య నమః 🙏
🙏 ప్రభాకరునికి ప్రభాత పద్య నైవేద్యం 🙏
🏵 తేట గీత మాలిక (810) 12..6..23 🏵

హరినిదలచుట వలదని యనుచు తండ్రి
చిత్రహింసలు బెట్టెను చిన్నవాని
దయయుధర్మమువీడియు దనుజరాజు
అనుచునారాయణాయని యనవరతము
భారమును వేసి ప్రహ్లాదు భజన సేయ
ఆదు కొనుచుండె నాహరి యలుపులేక
అట్టి దృశ్యాలుగాంచిన యయ్య వీవు
విష్ణు మాయల నెరిగిన విశ్వ తేజ

...............................................

ఇందుగలడందులేడనిసందేహమువలదు
చక్రిసర్వోపగతుండు ఎందెందు వెదకి....
భగవంతుని సర్వాంతర్యామిత్వాన్ని
తెలిపే పద్య రాజము

సమర్పణ: నన్నపు రాజు రమేశ్వర రాజు
🏵 గుర్తూరు / ..హనుమకొండ 🏵

అందాల రాజు ఆకాశాన నడయాడు రారాజు

అవని పైకి కిరణాల పంపి అలరించు రారాజు

అందాల రంగులు సృష్టించిన రారాజు

అవసరాలను రోజు తీర్చేటి రారాజు

అగాధమగు సాగరాల అలలలో నిండు రారాజు

అడవిలన్నింటికీ ఆకుపచ్చ శక్తినిచ్చు రారాజు

అంబటేల ముందే దర్శనమిచ్చు రారాజు అందరి ప్రార్ధనలతో తృప్తి నొందు రారాజు

ఓం శ్రీ అంబరాన నుండి అన్నీ అందించు దేవా

శ్రీ ఆదిత్య తేజో కరుణాకర నమో నమః 🙏 💡

బాలచందర్ ఉమా

తొలి పొద్దునే
పొడగంటి మయ్యా బింబరుపుడా
మము ఎప్పుడూ విడవకయ్యా నింగి రాయడా
కోరి మమ్ము మేలుకొల్పు నట్టి తొలి దేవుడా
నిత్య గమనంలో వెంటనడచు దివ్య రూపుడా
పంచభూతముల సమన్వయపరచు పరిపూర్ణుడా
ప్రకృతిని సదా సంరక్షించు పూర్ణ శక్తుడా
ప్రత్యక్ష దర్శనమిచ్చే నయనానందుడా
మాచే నొసగు ప్రార్థనల స్వీకారకుడా

ఓం శ్రీ తొలి పొద్దు పొడగంటి బింబరూప దేవా
శ్రీ ఆదిత్య తేజో భాస్కర నమో నమః🙏 💡

బాలచందర్ ఉమా

ఆత్మీయ బంధు మిత్రులకు🙏
భాను వాసర సుప్రభాత🙏 🙏
నమస్సుమాంజలి🙏 🙏
************
🙏 ఓం సం పూ ర్ణా య నమః 🙏
🙏 ప్రభాకరునికి ప్రభాత పద్య నైవేద్యం 🙏
🏵 తేట గీత మాలిక (809) 11..6..23 🏵

కోతి పిల్లగ మారియు కోరి తాను
చెట్టు కొమ్మన నక్కియు గుట్టు గాను
చూసిజానకిన్, వినయానచూపిబటువు,
అమ్మ సిగపువ్వుబుచ్చుక, నాకలి యన,
అమ్మ యాజ్ఞతో ఫలముల నారగించి
బలము చూపించవనమును భంగపరిచి
చూచి రమ్మన్న కాల్చిన శూరుడయ్య
తమరిశిష్యుండుఘనుడయ్య అమరవంద్య

..............................................

పానీయంబులుద్రావుచుం గుడుచుచున్
భాషించుచున్, హాసలీలా నిద్రాదులు...
పరమభక్తునిలక్షణాలుతెలిపేపద్యం
సమర్పణ: నన్నపు రాజు రమేశ్వర రాజు
🏵 గుర్తూరు / హనుమకొండ🏵

ఆత్మీయ బంధు మిత్రులకు 🙏
స్థిరవాసర సుప్రభాత🙏 🙏
నమస్సుమాంజలి🙏 🙏
***********

🙏 ఓం ధృ తి క రా య నమః 🙏
🙏 ప్రభాకరునికి ప్రభాత పద్య నైవేద్యం 🙏
🏵 తేట గీత మాలిక (808) 10..6..23 🏵

నాల్గుకార్తులుగడిచెను నయముగాను
కృత్తికయురోహిణీలందు క్రూరముగను
ఎండ ధాటికి ప్రాణుల గుండెలదిరె
చల్లదనముకై నెల్లరు తల్లడిల్లె
ఇట్టిసమయాన మృగశిరయింపుగాను
ఝుల్లులను మోసుకొనివచ్చె జాలితోడ
ఉల్లముల సేద దీరను మెల్లగాను
ఎండలైనను చినుకుల పండుగైన
నీదుభిక్షయె నిండుగా నింగిరాయ

...............................................

కంటినదీతటంబు పొడగంటిని భద్రనగాది వాసమున్
ఒక్క పద్యంలో భద్రాచల వర్ణన
సమర్పణ:నన్నపు రాజు రమేశ్వర రాజు
🏵 గుర్తూరు / హనుమకొండ 🏵

కలలుగనే కనుల నిద్ర లేపేవు కమలముల తాకి
వికసింపజేసేవు
కడలిలో అలలకు మెరుపులు పంపేవు
కమనీయ దృశ్యాల గగనాన నింపేవు
కానలలోని వృక్షాలకు హరితాన్ని అద్దేవు
కడవరకు జీవులకు ప్రాణాలు నిచ్చేవు
కనులారా చూడ తమ దర్శనమిచ్చేవు
కరుణించి మా ప్రార్థనలతో దీవించేవు

ఓం శ్రీ కనుల ప్రియ కమలముల ప్రియా దేవా
శ్రీ సూర్య తేజో మిహిరా నమో నమః🙏 💡

బాలచందర్ ఉమా

ఆత్మీయ బంధు మిత్రులకు 🙏
భృగు వాసర సుప్రభాత🙏 🙏
నమస్సుమాంజలి🙏 🙏

***********

🙏 ఓం చ క్ర వ ర్తి నే నమః 🙏
🙏 ప్రభాకరునికి ప్రభాత పద్య నైవేద్యం 🙏
🏵 తేట గీత మాలిక (807) 9..6..23 🏵

రోహిణీకార్తె ఎండకు రోళ్లుపగిలె
చండకిరణాల ధాటికి దండిదేవ
చెట్టుచేమలు మొక్కలు వట్టిపోయె
పశులుపక్షులు దాహాన బాధనొందె
మానవులు తట్టుకోలేక మదనపడిరి
రోహిణమ్మకు వీడ్కోలు లోకమంత
చెప్పనుత్సాహపడిరయ్య గొప్పగాను
ఝల్లులనుపంపు మా దేవచల్లబడగ
మృగశిరమ్మున నిత్యము సెగలుతగ్గి
పుడమిలో వేడి క్షీణించ పూష్ణదేవ

.................................................

లలనాజనాపాంగ వలనావసదనంగ
తులనాభికాభంగ దోఃప్రసంగ...
శబ్దాలంకారానికి మకుటాయమానం
భట్టుమూర్తివిరచితవసుచరిత్రలోనిపద్యం
సమర్పణ:నన్నపు రాజు రమేశ్వర రాజు
🏵 గుర్తూరు / హనుమకొండ 🏵

ఆత్మీయ బంధు మిత్రులకు
బృహస్పతి వాసర సుప్రభాత
నమస్సుమాంజలి
**********

🙏 ఓం అ భ య ప్ర దా య నమః 🙏
🙏 ప్రభాకరునికి ప్రభాత పద్య నైవేద్యం 🙏
🏵 తేట గీత మాలిక (806) 8..6..23 🏵

మచ్చరంబునగజరాజు మడుగుజొచ్చి
ఆడ గజములతోడను నాటలాడ
మకరమొక్కటి కాల్బట్టెమదియుచెదర
పోరు సల్పెను చాన్నాళ్లు జోరుగాను
ఆశ చావగ నార్తితో హరిని బి
వచ్చివధియించె మకరినివనరగాను
హరినిదర్శించు భాగ్యముహస్తిబొందె
మకరి చేసెను మేలు నా మత్తకరికి
చిత్రమౌఘుట్టమే కదా మిత్ర దేవ

..............................................

లావొక్కింతయులేదుధైర్యము
విలోలంబయ్యె ప్రాణంబులున్
గజేంద్రుని దీనావస్థను తెలిపే
సుప్రసిద్ధ పద్య రాజము
సమర్పణ: నన్నపు రాజు రమేశ్వర రాజు
🏵 గుర్తూరు / హనుమకొండ 🏵

ఆతృతగా వచ్చేవు ఆత్మీయంగా మేల్కొల్పేవు l
అపురూప కిరణాలతో అన్ని చోట్ల చేరేవు

సమయం గడిచిన కొలదీ మారుతున్నావు
మండేటి ఎండల మాపై కురిపిస్తున్నావు

కనికరించి కరుణించి
తగ్గించమని కోరేము
తమ చల్లని వెలుగులో బ్రతకాలని వేడేము

ఉదయాన తమరి దర్శనానికి వేచేము
అందరం ప్రార్థించి తమ దీవెనలు కోరేము

ఓం శ్రీ ప్రచండాగ్ని కిరణ ప్రసార దేవా
శ్రీ భాను తేజో భాస్కర నమో నమః 🙏 💐

బాలచందర్ ఉమా

లోపకార్యాముల నెంచ కార్యము దాల్చేను
నొంకబూనికొని! అభండాలను దూర్చి చొప్పించే
దూత వెదవలు! అపహేలితో ఆవహించిన గర్వ మూర్ధులు!
సడలింపు దొరకని మూర్ఖ దూర్ధులు!
పాషణమౌదురు పక్షపాతికి పక్షవాతం వోలె నిలువద్ధము
నెరుగక!!

ప్రవిరారా

విజయ రామ రాజు

ఆత్మీయ బంధు మిత్రులకు🙏
సౌమ్య వాసర సుప్రభాత🙏 🙏
నమస్సుమాంజలి🙏 🙏
***********

🙏 ఓం భో క్త్రే నమః 🙏
🙏 ప్రభాకరునికి ప్రభాత పద్య నైవేద్యం 🙏
🏵 తేట గీత మాలిక (805) 7..6..23 🏵

మిత్రులుందురు నెందరో మితములేక
నేటి కాలాన మాకిల నింగిరాయ
అవసరార్థపు స్నేహాలు నధికమయ్య
స్వార్థపూరిత చెలికాళ్లు చాలనయ్య
ఆప్త మిత్రుల శాతము నల్పమయ్య
ఆప్త మిత్రుడు దొరుకుట యరుదునయ్య
అసలు మిత్రుడవీవయ్య ఆదిదేవ
ఆయురారోగ్యములనిచ్చు అరుణ దేవ

..................................................

బాలరసాలసాల నవపల్లవకోమలకావ్య
కన్యకన్ కూళలకిచ్చియప్పడుపుకూడు
పోతనఆత్మాభిమానము తెలిపేపద్యం
సమర్పణ:నన్నపు రాజు రమేశ్వర రాజు
🏵 గుర్తూరు/ హనుమకొండ 🏵

స్వార్థ చింతన లేని దైవం
ఓ జాబిలమ్మ
లోకాహితం కొరకు నిత్యపయనం
ఓ జాబిలమ్మ
ప్రేమ కొలది మేలుకొలుపు బంధువు
ఓ జామిలమ్మ
వెలుగునిస్తూ వెంట నడుచు
ఓ జాబిలమ్మ
జీవులకు ప్రాణమిచ్చు ప్రకృతికి అందాలు ఇచ్చు
ఓ జాబిలమ్మ
గ్రహరాశుల గమనమై
జాబిల్లికి వెన్నెలనిచ్చు
ఓ జాబిలమ్మ
ప్రతి గడప ముందుకొచ్చి దర్శనమిచ్చు
ఓ జాబిలమ్మ
ప్రార్థనలు మాత్రమే స్వీకరించి ఆశీర్వదించు
ఓ జాబిలమ్మ
ఓం శ్రీ నిస్వార్థ గమన ఆదర్శ దేవా
శ్రీ పుష్ణ ఖగాయ తేజో నమో నమః 🙏 💐

బాలచందర్ ఉమా

"ఇచట జాబిలమ్మ అంటే ఒక మగువ ఒక స్త్రీ ఒక అమ్మ "

ఆత్మీయ బంధు మిత్రులకు 🙏
భౌమ వాసర సుప్రభాత🙏 🙏
నమస్సుమాంజలి🙏 🙏
***********

🙏 ఓం దా త్రే నమః 🙏
🙏 ప్రభాకరునికి ప్రభాత పద్య నైవేద్యం 🙏
🏵 తేట గీత మాలిక (804) 6..6..23 🏵

దూరముగవచ్చువారిని దు:ఖితులను
హనుమయనుమానముగజూచి యడుగెనిట్లు
ఎవరుమీరయ్యనిటురాను నేమి పనియు?
చూడ సుందర రూపాలు శోభగలిగి
రాచ  ఠీవియె రమణించె లక్షణముగ
సాయమేదైన వలయునా! స్వామియనగ
సంత సించియు రాముడు నంత జెప్పె
హనుమ తీరుకు మదిబొందె నధిక తృప్తి
నీదు శిష్యుడు జ్ఞానాన నిండుకుండ
మీరునిరువురే మాకిల మిగుల యండ

.................................................

ఏ వేదంబు పఠించె లూత భుజగంబే
శాస్త్రముల్సాచె....నిజమైన భక్తికి
మానవ,జంతు,కుల భేదాలులేవని
తెలిపే  పద్య రాజము

సమర్పణ:నన్నపు రాజు రమేశ్వర రాజు
..గుర్తూరు /  హనుమకొండ

తనువు నిండా అగ్ని బాండం ఎగిసిపడే నిప్పుకణం
నిరంతరం జ్వాలా తోరణం  ఓంకార ప్రేరణం

మండే మంటలనుండే చల్లటి వెలుగు కిరణం
సమస్థ లోకాల కళ్యాణం చక్కని ఆభరణం

పర్యావరణం పరిపూర్ణ విశిష్ట భూషణం
అందాల రూపణం పరోపకార ప్రేరణం

ప్రత్యక్ష దర్శనం చరణం తమ దివ్య చరణం
ప్రార్ధనల స్వీకారణం నిత్య ఆశీర్వచనం

ఓం శ్రీ అగ్ని బాండ వెలుగుల దేవా
శ్రీ కరుణాకర తేజో మిత్ర నమో నమః 🙏 💐

బాలచందర్ ఉమా

ఆత్మీయ బంధు మిత్రులకు 🙏
ఇందు వాసర సుప్రభాత🙏 🙏
నమస్సుమాంజలి🙏 🙏
***********

 ఓం ప్రి య కృ తే నమః 🙏
 ప్రభాకరునికి ప్రభాత పద్య నైవేద్యం🙏
🏵 తేట గీత మాలిక (803 ) 5..6..23 🏵

పతిని బ్రతికింపమని కోరి పరమ సాధ్వి
పరగ సావిత్రి యమునితో పయనమాయె
నయము,భయమునచెప్పినా నాతివినక
వెంబడించగ నాగియు విస్మయమున
మెచ్చి సమవర్తి వరముల నిచ్చెతాను
మూడువరములు బొందియుముదితమరలె
నీదు కొమరుండు నిజముగా నిర్జరాయ
దయను కలిగినవాడయ్య దండి దేవ
తండ్రి కొడుకుల కొలిచేము తగు విధాన
..................................................

కాటుకకంటినీరు చనుకట్టుపయింబడ
నేలయేడ్చెదో కైటభదైత్యమర్దనుని
చదువులతల్లికి
పోతనఓదార్పుపద్యం
సమర్పణ:నన్నపు రాజు రమేశ్వర రాజు
గుర్తూరు.../ ...హానుమకొండ



వెలుగు కిరణం వెలుగునిస్తూ వెలగనీ వెలగనీ
కలలుగనే కంటిపాపను మేలుకొలుప వెలగనీ వెలగనీ

మసక బారిన కొండా లోయల చూపించుటకై
వెలగనీ వెలగనీ ఎగిసిపడే అలల కిరణం
మెరుపులకై వెలగనీ వెలగనీ

కటిక చీకటిని పారద్రోల వెలగనీ వెలగనీ
ప్రాణవాయువును ఇచ్చు చెట్టు కొమ్మల సత్తువకై
వెలగనీ వెలగనీ

ప్రతి ఉదయం దర్శనమిచ్చి నయనాలు నింప వెలగనీ
వెలగనీ
నిత్య ప్రార్ధనలు అందుకుని దీవింప వెలగనీ వెలగనీ

ఓం శ్రీ నిరాటంక వెలుగుల ప్రసాద దేవా
శ్రీ సూర్య తేజో ప్రభాకరా నమో నమః 🙏 💐
బాలచందర్ ఉమ

ఆత్మీయ బంధు మిత్రులకు🙏
భాను వాసర సుప్రభాత🙏 🙏
నమస్సుమాంజలి🙏 🙏
**********

🙏 ఓం మ హా వ రా హా య నమః 🙏
🙏 ప్రభాకరునికి ప్రభాత పద్య నైవేద్యం 🙏
🏵 తేట గీత మాలిక (802) 4..6..23 🏵

సీత జాడకై వెడలిన కోతులపుడు
అల మహేంద్రగిరినిజేరి హనుమదండు
దక్షిణంబున సంద్రము తాము జూచి
తలచు చుండిరి దానిని దాటుటెట్లు
హనుమలంఘించగలడని యందరనిరి
జాంబవంతుడుపొగడగా జయమటంచు
సింహనాదముచేయుచు చెంగుమనియు
పర్వతంబంతయదరగా పవన సుతుడు
వ్యోమమార్గాన వెడలుట క్షేమముగను
చూచి యానంద పడితివా!! సూర్య దేవ

.....................................................

ఆరంభించరునీచమానవులువిఘ్నాయాస
సంత్రస్తులైయారంభించిపరిత్యజించుదురు
మానవులలోరకాలనుతెలిపే పద్యరాజం

సమర్పణ:నన్నపు రాజు రమేశ్వర రాజు
గుర్తూరు / హనుమకొండ

జీవులారా జీవ శ్రేష్టులారా జీవఉనికి లార
చీకటి పారద్రోల వెలుగు కిరణాలు  వస్తున్నాయ్

చెట్టులార చేమలార చల్లటి గాలులార
హరిత శక్తినివ్వ సూర్య కిరణాలు వస్తున్నాయ్

కొండలార కోనలార జలబాండాలార
తల తల మెరుపుల కోసం లేత కిరణాలు వస్తున్నాయ్

విశాల హృదయాల ఆదిత్య దర్శన ప్రేమికులార
ప్రార్ధనలు స్వీకరించ ఆదిత్య కిరణాలు వస్తున్నాయ్

ఓం శ్రీ విశేష అవసరాల దాన ప్రభో
శ్రీ సమిత్ర తేజో మిహిరా నమో నమః🙏 💐

బాలచందర్ ఉమా



నమస్కారం
మీరు భానుడి పై వ్రాస్తున్నందుకా
ఈ కోపం...
మేము చదువుతున్నందుకా
ఈ కోపం....



కవి అయివుండి వ్రాయని వారిపైనా
ఈ కోపం....
ఈ గ్రూపులో జాయిన్ కాని కవి  పైనా
ఈ కోపం....
చదివి కామెంట్ చేయని వారిపైనా
ఈ కోపం....
ఈ తీవ్రమైన ప్రతాపం ఎందుకో

పూర్ణచందర్ రాజు







విశ్వ ప్రాణుల నిదురలు చీకటులు
తొలగించుటకై పంపు నిత్యం తమ వెలుగులు

పయనం కొనసాగిస్తూనే కలిగించు రక్షణలు
ఆగకుండా నిర్దేశించు కాల ప్రమాణాలు

వృక్షజాతులకెల్ల నిండార పిండి పదార్థాలు
ప్రాణజాతులకు నింపు శక్తి కణాలు

ఉదయపు ఆగమనం లోనే ప్రత్యక్ష దర్శనాలు
అందుకే దేవా స్వీకరించు మా ప్రార్థనలు

ఓం శ్రీ సురక్షకరా పరిపూర్ణ దేవా శ్రీ భాస్కర తేజో
ఖగా నమో నమః 🙏 💐

బాలచందర్ ఉమా

ఆత్మీయ బంధు మిత్రులకు 🙏
స్థిర వాసర సుప్రభాత🙏 🙏
నమస్సుమాంజలి🙏 🙏
***********

🙏 ఓం త్రి లో చ నా య నమః 🙏
🙏 ప్రభాకరునికి ప్రభాత పద్య నైవేద్యం 🙏
🏵 తేట గీత మాలిక (801).3..6..23 🏵

సగము రోజంత కనిపించు స్వామి నీవు
పగలువెలుగులు ప్రసరించుప్రభువునీవు
రాత్రి యందున నటువైపు రాజు వీవు
పగలు రాత్రులు నేవైన జగము కంత
వేడి, వెల్గుల నందించు రేడు నీవు
తొడలు లేని సారథియైన, దౌడుతీయు
ఏడు గుర్రాల రథమున్న యేలి కీవు
ఏలుకోవయ్యమమ్ముల ఇన మహాత్మ

..............................................

ధర ఖర్వాటు డొకండు సూర్య కర
సంతప్త ప్రధానాంగుడై త్వర తోడన్
దురదృష్టవంతుని బ్రతుకు చిత్రం
తెలిపే పద్య రాజము

సమర్పణ:నన్నపు రాజు రమేశ్వర రాజు
🏵 గుర్తూరు/హనుమకొండ 🏵

ఆత్మీయ బంధు మిత్రులకు🙏
భృగు వాసర సుప్రభాత🙏 🙏
నమస్సుమాంజలి🙏 🙏

***********

🙏 ఓం ప వి త్రా త్మ నే నమః 🙏
🙏 ప్రభాకరునికి ప్రభాత పద్య నైవేద్యం 🙏
🏵 తేట గీత మాలిక (౮౦౦) 2...6..23 🏵

గుండె నిండుగ గురువుగ కోరి నిన్ను
నీదు షరతును పాటించి నియతి గాను
నీదు వెంటను యానించి నిష్ఠ తోడ
సకల శాస్త్రాలు నేర్చెను సాధకుండు
బహుగ వ్యాకరణమునేర్చెపండితుండు
శ్రద్ధగా సాగి నిత్యము శ్రమను మరిచి
తనుచిరంజీవి నాయెగా తమరిదయను
తగిన గురువువే నీవయ్య తనకునిజము

..............................................

ఒకచోనేలనుబవ్వళించునొకచో నొప్పారు
పూసెజ్జపై నొకచో శాఖము లారగించు..
కార్యసాధకునిలక్షణాలుతెలిపే సుపద్యం
సమర్పణ: నన్నపు రాజు రమేశ్వర రాజు
🏵 గుర్తూరు / హనుమకొండ 🏵

అనంత ఆకాశంలోతొలి వెలుగు కిరణమా
అశేష లోకాల చీకటుల తొలగించు కిరణమా

సింధూరమై ఏతెంచి శక్తి అందించు కిరణమా
అవని పై నున్న వృక్షాలకు ఇచ్చు  హరిత కిరణమా

అద్భుత సంద్రాల ఆవిరి చేసి ఆకాశం చేర్చు కిరణమా
కారుమబ్బుల సృష్టించి వర్షాన్నిచ్చు కిరణమా

మా కొరకు నిత్యం వచ్చే దర్శన కిరణమా
మా ప్రార్థనలు అందించ దీవించు కిరణమా

ఓం శ్రీ  అఖండ కిరణాల వ్యాప్తి దేవా
శ్రీ భాను తేజ మిత్ర నమో నమః 🙏 🌷

బాలచందర్ ఉమా

తుల్యం విశతుల్యం
పొగచూరిన తిత్తుల్లు
ఊపిరి సడలని గుక్కిల్లు
ప్రసరింపని రక్తపు కణజాలం
రిక్తం గుండె చప్పుడు నిర్మానానికై..
పొగన పొగాకు పెట్టె నిర్మాణకణజాలం!
నీ కాయన శవంకై నిల్చే అగ్గిపెట్టె వోలె శవ పేటికవై!!

ప్రవిరారా
విజయ రామ రాజు

తూర్పు దిక్కున మొదలెడు వెలుగుల నడక
ఎన్నో అందాల అద్భుతాలు చూడాలిక

పరుగున ఊరికే లేగ దూడల గంతులిక
రివ్వున ఎగిరే పక్షి రాజముల గుంపులిక

జలజల పారే నదులలో నీటి పుష్పరాజసమిక
పిల్లగాలులో హరిత శాఖల వనాలిక

ప్రొద్దు ప్రొద్దున అనే దర్శనాన రాజసాలిక
ప్రార్ధనలు అందించ మనసు ఉబలాటమిక

ఓం శ్రీ ఆకాశ ఉదయ రాజసాల దేవా
శ్రీ పుష్పతేజం మీరా నమో నమః 🙏 💐

బాలచందర్ ఉమా

ఆత్మీయ బంధు మిత్రులకు 🙏
బృహస్పతి వాసర సుప్రభాత🙏 🙏
నమస్సుమాంజలి🙏 🙏
************

🙏 ఓం వ క్త్రే నమః 🙏
🙏 ప్రభాకరునికి ప్రభాత పద్య నైవేద్యం 🙏
🏵 తేట గీత మాలిక (799) 1..6..23 🏵

దేవతలకందరికి పలు దివ్య మైన
శక్తియుక్తులు కలిగిన శస్త్రములును
విస్తృతంబైనబలమున్నయస్త్రములును
అందుబాటున యున్నవి నవసరముకు
ఆయుధము లేని దైవము వయ్య నీవు
అశ్వముల పగ్గములబట్టి అర్క దేవ
లోకముల నేలు చుంటివి లోక నాధ
చండ కిరణాలె దండిగా నుండ నీకు
ఆయుధముతోడపనియేమి అరుణదేవ

...............................................

శారదనీరదేందుఘనసార పటీర మరాళ
రకారానుప్రాసాలంకారములో
సరస్వతీ మాత సాక్షాత్కారం
సమర్పణ:నన్నపు రాజు రమేశ్వర రాజు
🏵 గుర్తూరు / హనుమకొండ 🏵



| | |
|---|---|
| సంపాదకురాలు | : శ్రీమతి చక్రహరి రమణ |
| జననం | : 08 ఏప్రిల్ 1970 |
| స్వగ్రామం | : సిద్దిపేట |
| తల్లిదండ్రులు | : భారతి,శంకర్ రాజు |
| భర్త | : యాదగిరి రాజు |
| సంతానం | : భగీరత రాజు,సాయి నటరాజు |
| చదువు | : M.A-Telugu,TS-SET,TPT(Phd) |
| విద్యాభ్యాసం | : |

| | |
|---|---|
| ప్రాథమిక విద్యా | ప్రభుత్వ బాలికల పాఠశాల,సిరిసిల్ల. |
| ఎస్సెస్సీ | ప్రభుత్వ ఉన్నత పాఠశాల,తంగళ్ళపల్లి. |
| ఇంటర్మీడియట్ | ఉస్మానియా విశ్వవిద్యాలయం. |
| డిగ్రీ | ఉస్మానియా విశ్వవిద్యాలయం. |
| టి.పి.టి. | ఏకశిలా కళాశాల,జనగామ. |
| పిజి | ఉస్మానియా విశ్వవిద్యాలయం. |
| పి.హెచ్.డి | తెలంగాణ విశ్వవిద్యాలయం. |
| వృత్తి | :అధ్యాపకులు-ఎం.ఏ.తెలుగు |
| ప్రవృత్తి | : కవితా రచన,సంగీతం |

